శ్రీ రామమోహన గ్రంథమాల.

అనుబంధము ౨

# మల్లెమొగ్గ



చలసాని సుబ్బారావు

# మల్లెమొగ్గ!

డంబు మీఱఁగ మాఘమా ♦ సంబునందు
మొక్క వేయఁగఁ దఱి యని ♦ పూన్కితోడ
నతిముదంబున నొక మల్లె ♦ యంటుదెచ్చి
యెలమి మొక్కకు నిరవైన ♦ బలముత్రవ్వి
దాని కింపుగఁ దగుదోహ ♦ దంబుఁ జేసి
పళ్లెరముభాతిఁ జుట్టుఁ గై ♦ వారమునిచి
నీరజాప్తుఁడు చరమాద్రిఁ ♦ జేరువేళ
పక్షులెల్లను గూళ్లకుఁ ♦ బాఱువేళ
పిల్లవాయువు లల్లన ♦ వెడలువేళ
ప్రాతిపెట్టెను నొక లేమ ♦ భద్రముగను
నీళ్లు పోసెను మెల్ల దో ♦ సిళ్లతోడ
నెలమి నా చిన్ని మొక్కని ♦ పిలువఁదొడఁగెఁ
బ్రేమమంతయు దానిపై ♦ నైచియుంటఁ

బలువిధంబుల యోచన • లొన్నుచుండెఁ
గటికిచీఁకటు లెల్లెడఁ • గ్రమ్మియుండెఁ
బొ్ద్దుపోయినసంగతి • బొత్తిగాను
గానకుండెను దానిపై • ధ్యాన మునిచి
నేఁడు 'పరిమళ' యింకను • నిలయమేల
చేరకుండెనొ తెలియదు • కారణంబు
అంచు వగచుచుఁ దల్లి తా • నతిరయమున
నిరుగుపొరుగులవారల • యిండ్ల కేఁగి
యమ్మలక్కల నందఱి • నడుగసాగె
నేమొ యావేళ నామెను • నెఱుఁగ మంచు
సరవి వారెల్లఁ జెప్పగాఁ • జంద్రికళకుఁ
జింత యొదవెను నెమ్మోము • చిన్నవోయెఁ
గలికికన్నీరు మున్నీరు • గాఁగఁ బాఱ
నలయఁ గ్రొవ్వేఁడినిట్టూరు • పులు చెలంగె
వేఱుత్రోవను నింటికి • వెడలెనేమొ
యంచు జనయిత్రి యింటికి • నరుగుచుండ

రమణి పరిమళ యనతిదూ ♦ రంబులోనఁ
దల్లిరాకనుగాంచి సం ♦ తసముతోవ
సమ్మరో! యిప్పు డేడకు ♦ నరిగి తనుచు
ముద్దుమాటలఁ దల్లిపై ♦ మోపి నెపము
మందహాసంబుతోఁ దన ♦ మాత కేదుఃచు
వోయి యాలింగనమ్మును ♦ జేయనపుడు
తల్లి హర్షంబునకును నం ♦ తంబు గలదె?
తల్లి వికసితవదనయై ♦ తనరుచుండె;
చిలుకపలుకులఁ గథనెల్లఁ ♦ జెలువ చెప్పె;
పిల్లచెప్పినకథ నెల్లఁ ♦ దల్లి వినుచు
స్మితము మోమునఁ జెలఁగ న ♦ చ్చెరువుఁ జెందె
రేయి యాంతయుఁ బరిమళ ♦ హృదయ మెల్ల
మొక్కపైఁ బెట్టి ధ్యానింప ♦ మొదలుపెట్టె;
కమలమిత్రోదయంబున ♦ కన్ను ముందె
మొనసి చీఁకటు లెల్లను ♦ బోకముందె
మొక్కడగ్గఱ కరిగెను ♦ ముదముతోడ

నీళ్లు పోసెను పేర్మి దో ♦ సిళ్లతోడఁ
జెలిమికత్తెలఁ గొంపోయి ♦ యెలమి నటకు
నాటపాటల నయ్యెడ ♦ నాడుచుండె
మొక్క మూడవదినమందు ♦ మోమువాంచి
వాఁడినది కొంచె మప్పు డా ♦ బాల చూచి
మొగము వాలిచి మిక్కిలి ♦ వగవఁదొడఁగెఁ
గన్నుఁగవ వేఁడిబాష్పము ♦ ల్కాల్వగట్టె
ఘనజవంబునఁ దనతల్లి ♦ కడకు నేగి
పొనరఁ దనతల్లిమోమున ♦ మోముఁ జేర్చి
చెప్పఁ దొడఁగెను వింతగాఁ ♦ జిత్రమెల్లఁ
దనయ చెప్పినదంతయుఁ ♦ దల్లి వినియుఁ
తల్లి? యని ముద్దుబిడ్డని ♦ దరికిఁ దీసి
పూని ప్రియభాషణమ్ముల ♦ బుజ్జగించి
"యింతదానికి నీవు చిం ♦ తింపకమ్మ
వేఁడినిట్టూర్పు దీనికై ♦ విడువకమ్మ
పొలతి యీవేళ నీళ్లను ♦ బోయకుమ్మ

యవనిలో నన్ని మొక్కల ♦ కదిస్వభావ
మెల్లి ప్రొద్దున నిద్దాని ♦ యింపుఁ గనుము"
అంచు ముద్దాడి యాబాల ♦ ననిపెఁ దల్లి.
తనయ యాదినమెల్ల ఖే ♦ దమున నుండెఁ
బంచమాహ్నంబునందునఁ ♦ బల్లవంబు
లంకురింపఁగఁదొడఁగిన ♦ నతివ చూచి
మొక్క బ్రతికె నటంచును ♦ ముదముఁ జెందె;
అంతఁ గ్రమముగఁ దీవియు ♦ లలముకొనుచు
జొంపములుగాఁగఁ బెరిగెను ♦ సొంపుమీఱ
రెమ్మలెల్లను నిగనిగ ♦ లీనఁదొడఁగెఁ
జిఱుత యేప్రొద్దు నచటికి ♦ నరుగుచుండె;
అంతఁ గ్రమముగ శిశిరర్తు ♦ వంతమొందె
సలరెఁ బుడమిని శ్రీవసం ♦ తాగమంబు
లలితతరుగుల్మనవలతా ♦ వళులు వేడ్కఁ
గోమలములైన చిగురులఁ ♦ గూడుచుండె
నాలుమగలెల్ల సంతస ♦ మందుచుండిరి;

చూతకిసలయజాలమ్ము ♦ మేఁత మేసి
గండుగోయిల లెల్లెస ♦ దండిమీఱఁ
బంచమస్వరమున లెస్స ♦ బాడఁదొడఁగెఁ
బ్రిపవరసమత్తభృంగాళి ♦ రవము హెచ్చె
వరుసఁ బుష్పించె నుద్యాన ♦ వనము లెల్ల
మలయమారుతపోతము ♦ లమ్రసలఁదొడఁగె
హాయిఁ గూర్చుచు నున్నవి ♦ యువనిలోనఁ
బండువెన్నెలప్రభలును ♦ బ్రిబలుచుండె
వెన్నెలలలోన మొక్కలు ♦ పెరుగులెస్స
మగువ పరిమళ ప్రాప్తిన ♦ మల్లెయంటు
మొనసి చిగిరిచి క్రమముగా ♦ మొగ్గలెత్తెఁ
దనరుచున్నట్టివజ్రింపుఁ ♦ దునక లనఁగ
లలితమైనట్టిముక్తాఫ ♦ లంబు లనఁగ;
వానిసొగసును దిలకించి ♦ పరిమళయును
నతులమైనట్టియానంద ♦ మందుచుండె
పరవి వికసిల్లెఁ బూర్ణిమా ♦ చంద్రుమూడ్కి

వాని యాకృతి నెల నా • బాల చూచి
ప్రమద మొందుచుఁ దనతల్లి • పజ్జ కేగి
ముద్దుపలుకులఁ బలుకుచుఁ • బొంతఁ జేరి
సరవి మల్లిక పూచిన • చరితమాత
పూసగుచ్చినమాదిరి • ముచ్చటించి
అమ్మ! చూడవె నామల్లె • యంటు నంచుఁ
గోకచిఱిచెంగు లాగుచుఁ • గూర్మితోడ
ముద్దులొలికెడిగారాబు • మోముతోడ
పిల్లపడకలనాబాల • వెడల ముందు
బిడ్డముగ్గును దీర్పఁగఁ • బ్రేమతోడఁ
దల్లి వెంటాడె మందస్మి • తంబుతోడ
అప్పు డాబిడ్డ చూపిన • యరుఁగుమీఁదఁ
గూఁతుపట్టును జెల్లింపఁ • గూరుచుండఁ
దనయ నగుమోము వర్ణింపఁ • దనివి యగునె?
తనరు మొగ్గలెసారును • దల్లిచూచి
చారుతరపుష్పసాయక • సాయకములె

# మల్లెమొగ్గ.

యంచుఁ దలపోసి వానిసో ♦ యగముఁ గాంచి
బిడ్డ మొగ్గలసంగతి ♦ వివిధగతులఁ
బూని వర్ణింప జనయిత్రి ♦ మోమునందు
స్మితవిలాసంబు లుదయించెఁ ♦ జెన్నుమీఱ
నోసర గాదిలిబిడ్డను ♦ నొడిని జేర్చి
యెలమి నీమొక్కఁ బెనుప నీ ♦ కెల్లు తెలిసె
నిపుణురాలవు మిక్కిలి ♦ నీతిమతివి
యంచు మృదుభాషణంబుల ♦ నామెప్రేమ
సలదుఁ జెక్కిలి నొక్కము ♦ ద్దాడియాడి
శిరము మూర్కొని చిఱునవ్వ ♦ చెలువుతోడ
వింతపలుకుల బిడ్డకు ♦ విందొనర్చి
తల్లి హార్షముతో నుండెఁ ♦ దనయఁగూసి.
పసిడిచేలంబు లున్నసం ♦ తసముకంటె
రత్నవస్తువు లున్నహా ♦ ర్షమునకంటె
నెలమిసుత యాడునొకపల్కు ♦ విలువగాదె
అతుల మైనట్టిసంతస ♦ మదియె యిచ్చు

ననుఁగుబందుగు లెందఱో ♦ యలరుచున్న
నెలమి సుతయిచ్చునానంద ♦ మీయఁగలరె?
యిచ్చకపుమాటలెల్లను ♦ నెలమి బిడ్డ
పలుకుకంటెను నుబ్బింపఁ ♦ గలవె యిలను
పిల్లపలుకులఁ దనమది ♦ పల్లవింప
శిరము మూర్కొని జనని తాఁ ♦ జెక్కు నొక్కి
యొగిని ముద్దాడి చెంగున ♦ నున్నరూక
విప్పి తనబిడ్డచేతికి ♦ వేడ్క నిచ్చి
పాలుమీఁగడ లీవేళఁ ♦ బట్టి నీకు
నిడుదు సంచును నరిగెను ♦ నింటి కామె.
అంతఁ బరిమళ మరునాఁడు ♦ హర్ష మెసఁగ
గమగమ యటంచు వాసనల్ ♦ గ్రమ్ముచున్న
మల్లెపొదఁ జేరి మొగ్గలు ♦ మెల్లఁ గోసి
దండగాఁ గూర్చి తనతల్లి ♦ దరికి నేగి
కేల నాదండఁ బైకెత్తి ♦ లీలతోడ
వాణిముత్యాలపేరుల ♦ సపహాసించి

కప్పురపుదండ నిరసించి • గ్రాలునట్టి
దమ్మ యీదండ నెవ్వారి • కమ్మ యిడుదు
పలుకు మమ్మరో యని పరి • మళవచింప
„దేశభాషాభివృద్ధియే • దివ్యమైన
పుణ్యకార్యంబటంచును • బూన్కితోడ
పరవి జ్ఞానాభివృద్ధికై • జతన మెపుడు
సలుపుచును జెన్నుమీఱంగ • శాశ్వతముగ
వాసిమీఱు శ్రీరామవి • లాస మనెడి
గ్రంథనిలయమ్మునకు నీవు • కానుకనిమ్ము
ఈశ్వరుఁ డోవంగునెపుడు నీ • యీప్సితముల
నిహపరసుఖంబు లెల్లను • నెలమినిచ్చు"
అనివచింపఁగ నామాట • లన్నియు విని
అమ్మరో యెల్లసుఖముల • కాకరమగు
నాదుహృదయంబు ధ్రువముగా • నీదెకాదె
తనయుడై పుట్టి భువిలోనఁ • దల్లిఋణముఁ
దీర్ప సర్వంబు; హర్షించు • దేవుఁడంచు

వినయ ముప్పొంగ నాదండ • వేడ్కఁతోడ
గ్రంథనిలయమ్మ్రుసకును న • ర్పణముఁ జేసి
ఘనత మీఱఁగఁ బరిమళ • యనెడిబాల
తల్లికోరికఁ దీర్చి తా • ధన్య యయ్యె.



N. B.— ఒకస్నేహితుని ప్రేరేపణచే నప్పటికప్పుడు చెప్పినది.

